శివధర్మగ్రంథమాల - ద్వితీయ బిల్వము.

# లింగధారణవిధిః





సంపాదకుడు.

రావికోటి మఠము వీరభద్రయ్య.

# లింగధారణవిధిః

వేదకావ్యస్మృతితీర్థ, ధర్మాచార్య, విద్యానిధి

పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారిచే సరిచూడఁబడి

రావికోటి మఠము వీరభద్రయ్యగారిచే

సాంధ్రతాత్పర్యముగఁ బ్రకటితము.

శా॥ శ॥ ౧౮౫౮., ధాత.

 1936. ( వెల ౬ అణాలు. )

Printed by B. V. R. Balreddy & Co., Secunderabad.

గ్రంథములు దొరకు స్థలము.

## శివధర్మగ్రంథమాల.

నెం. ౪౨౬౮, సర్జణలాల్ స్ట్రీట్,
సికింద్రాబాద్ దక్కన్.

లేక

రా॥ మ॥ వీరభద్రయ్యగారు,
నెం. ౧౬౪౩, ఈసామియాబాజారు,
హైద్రాబాద్ దక్కన్.

---

## శైవభారతీ భవనము.

నెం. ౪౨౬౮, సర్జణలాల్ స్ట్రీట్, సికిందాబ్రాద్ దక్కన్.

---

వీరశైవుల ప్రాచీనగ్రంథముల సంగ్రహమొక్కచోటలేనందున మతవిషయములందు చర్చలు జరిగినప్పుడు ఉపయోగపడుటలేవు. మఱియు దమయింట జీకి మురిగి నశించిపోవుచున్నను కొందరు తాళపత్రగ్రంథములను విద్వాంసులకుజూపనైనజూపరు. అయినను పదిసంవత్సరములనుండి విశేషముగఁబరిశ్రమించి పండిత చి|| మ|| వీరభద్రశర్మగారు ౮, ౧౦ వేల రూపాయిల వెలగల వివిధశాస్త్రగ్రంథములను సంపాదించి పైనామముతో నొకగొప్ప లైబ్రరీని స్థాపించినారు. కావున నికవిూదనెవరేకాని తమయింటనుండు ప్రాచీనగ్రంథరాజములను పై భవనమునకు [illegible]రక్షణకార్యములందు దోడ్పడగోరు

ఇట్లు,
వ్యవస్థాపకుఁడు.

వైదికోత్తములగు

శ్రీ మహంతు మఠము చెన్నబసవయ్యగారు.



భూలోకము. శా.శ. ౧౮౧౦ శివలోకము. శా.శ. ౧౮౫౪. ఫా॥

( అంగీరసనామ సం॥ ఫాల్గుణ బ॥ ౧౩ మంగళవారము. )

# గ్రంథసమర్పణము.

గీ॥ కన్నపుత్రునిమాడ్కి న । న్నిన్నియేండ్లు
పెంచి చదివించి వైదిక । సంచయమును
కరుణతోఁడఁ బ్రసాదించి । కరముదుఃఖ
రాశిలోముంచి ఫాల్గుణ । మాసమందు
శ్రీశివునిజేరి వైదిక । శ్రేష్ఠుఁడైన
చెన్నబసవమాతులు పద । సన్నిధాన
మునకు నర్పింతు నీగ్రంథ । ము మదీయ
ప్రథమకృతిగాన భక్తిమై । ప్రాజ్ఞులారా!

ఇట్లు,

రా॥ మ॥ వీరభద్రయ్య.



# శివపూజావిధి.

చాలకాలమునుండి శివమతస్థులకు సక్రమమైన శివపూజావిధిలేకుండెను. ఈలోపమును బోగొట్టుటకై బ్ర. శ్రీ. పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారు వివిధశాస్త్రముల బరిశీలించి యొకయుత్కృష్టమగు శివపూజావిధిని రచించినారు. ఇందు "స్నానవిధి, భూతశుద్ధి, తత్త్వశుద్ధి, షడధ్వశుద్ధి, సంకల్పము, భస్మరుద్రాక్షధారణ, పంచాక్షరన్యాసము, ప్రార్థన, అభిషేకవిధి, నమకచమకములు, పురుషసూక్తము, ఉపచారములు, తీర్థస్వీకారము, పూజాసమాప్తి, అనేకములగు శివస్తోత్రములు, గురుస్తోత్రములు, మంత్రపుష్పము, మంగళారతులు, అష్టకములు" మొదలైనవి సర్వయుక్తముగను శుద్ధముగను వ్రాయబడి అచ్చుకు సిద్ధముగానున్నది. దీనినియెవరైన అచ్చువేయించుచో వారిపేరుతో బ్రకటింపఁబడును. కావుననిట్టిమతోపకారకమును ఆవశ్యకమునునగు శివకార్యమునకు తప్పకతోడ్పడగలరని నివేదించుచున్నాము.

జాబువ్రాయుచోటు :—

శివధర్మగ్రంథమాలాధ్యక్షులు,

నెం. ४२८०, సర్జలాల్‌స్ట్రీట్,

సికింద్రాబాద్ దక్కన్.

# ఓం.

# సంపాదకీయము.

ముక్తికి మూలసాధనమగు లింగధారణము వీరశైవులకు బ్రాముఖ్యముగా విహితమై యున్నది. ఈ లింగధారణ మత్యంతపవిత్రమై జీవముతోబాటు సర్వకాల సర్వావస్థలయందు ధార్యము. స్మార్తులజన్నిదముబోలె నిది సన్యాసాశ్రమమున ద్యాజ్యముకాదు. అతిథులై వచ్చిన పరపురుషుల నెందరనాదరించి యుపచరించినను అంగనకు బతియే పరమదైవమైనటుల ఉపాసకుడగు వీరశైవుడు శుభాశుభావసరములలో నైమిత్తికముగ నితరదేవతల నాదరించి సత్కరించినను లింగరూపుడగు శివుడే యుపాస్యదైవము. కావున లింగైక్యమగుదనుక లింగధారణ పూజ లత్యావశ్యకము లగుచున్నవి. ఇట్టి మహత్తరమగు లింగధారణసంస్కారము స్వశాస్త్రముగ నెరవేరకుండుట లోపమని తలంచి శివమూర్తులగు మహంతుమఠము శ్రీ చెన్నబసవయ్యమానుగారు ముద్రించవలయునని యభిప్రాయముతో అనేక గ్రంథములను పరిశీలించి వ్రాసియుంతలో శివైక్యము నందిరి.

వీరు వైదిక విద్యలందు అరితేరి దేవతాప్రతిష్ఠలు మరియు మేడిచెలిమె శ్రీరామలింగేశ్వరస్వామి ఉత్సవము మొదలగు వైదికకార్యములను నెరవేర్చియుండిరి. వారితలంపు సంపూర్తి యగుటకు గాను నాయల్పవిద్యకు దగినటుల తెలుగు తాత్పర్యమును వ్రాసి ముద్రించితిని.

ఆంధ్రవీరశైవులలో స్వధర్మజ్ఞానాచరణలు పూజ్యములగుట జేసి పరమతికులప్రాసంగికముగ నైతము పరిహసించుచున్నారు. ముఖ్యమగు శివ లింగధారణము శివదీక్షలును విధ్యుక్తముగ నెరవేరుట లేవు. ఇట్టిలోపనివారణార్థమై ఈలింగధారణవిధి ప్రకటింపబడినది. స్వమతాభిమానులైరి దీని నెక్కువగా ప్రచారమొనర్చి సహాయపడుచో దక్కిన దీక్షావిధి గ్రంథమును ప్రకటింప వీలగును.

శ్రీశైలాది మహాపర్వత శిలలనుగాని చంద్రకాంత సూర్యకాంత నర్మదాబాణ శిలలనుగాని తీసికొని పంచసూత్ర ఘటితముగ లింగమును నిర్మించి అనగా :—

శ్లో॥ లింగవృత్తసమంపీఠం తావన్మధ్యం తదున్నతం ।
తదర్థం గోముఖం ప్రోక్తం పంచసూత్రం ప్రకీర్తితం ॥

లింగముయొక్క చుట్టుకొలతకు సరిపోవునటుల పీఠముయొక్క వెడల్పును, మరియు ఎత్తును, చుట్టుకొలతలోసగము లింగముయొక్క పొడవును, గోముఖమును నుండవలయును. సాధారణముగ నిపుడు మనలో నుపయోగింపబడుచున్న శ్రీశైల లింగములు శాస్త్రానుకూలముగ లేక బలపమువలె మెత్తగనున్నవి. శివలింగములను * తయారు జేయుటకు నాంధ్రదేశమున నొక కార్యాలయము స్థాపించ వలసియున్నది.

---

* కర్ణాటకదేశములోనొకచోట శాస్త్రపద్ధతిగా శివలింగములు తయారుచేయబడుచున్నవి. కావలసినవారికి అరణాలకు ఒక్కటి చొప్పున మేము పంపించగలము.

లింగధారులలో కొందరు లింగమును చాలగ వ్రేలాడగ ట్టుట మొదలగు అమంగలములను చేయుచున్నారు. "నాభే రథస్థాల్లింగస్య ధారణం పాపకారణం" యను ప్రమాణము చొప్పున నాభిభాగమునకు క్రిందుగాగట్టుట మహాపాతకమని నుడివి యున్నారు కావున ఇకనైనను నీ దురాచారమును మా నుకొందురు గాక! లింగమును ప్రాచీనావీతి ( ముక్తాహారము ) వలె కంఠము మీదుగా వక్షస్థలమువరకుగానో లేక వామ భుజము మీదుగానో ధరించ వలయును.

లింగమునకు సజ్జరసమును ( కంతిని ) చాల ఎక్కువగా బెట్టించుటయు పెద్ద పెద్ద చౌకులను వేసికొనుటయు, చొక్కా మీదుగా ధరించుటయు మున్నగు చిత్ర విచిత్రముల నికమీ ద విడిచి పెట్టుదురు గాక యని కోరుచున్నాడ.

ఇక గొందరు చోరభయము వలన వెండి, బంగారము లింగపుకాయలను వదలి శివలింగమును వస్త్రమందు ధరించు చున్నారు. ఇది సరికాదు. అట్టివారు శ్రీగంధము చెక్కతో చే యబడిన కాయల నుపయోగింపవచ్చును. బాలకులు, యతు లు, దీక్షలుకానివారలు ఎట్లు ధరించినను సహజముగా వీర శైవులందరును ముప్పదియారు పోగులు గలిగినట్టి శివసూత్ర ము ( లింగసూత్రము శివదారము ) ను ధరించ వలయునని ఈ క్రింది వాతూలాగమ ప్రమాణముపదేశించుచున్నది. :—

" జ్ఞానం కర్మ సముచ్చిత్య శ్రీగురులింగజంగమాః ।
షడ్విధాః షట్స్థలై ర్యుక్తాః షట్త్రింశత్ తత్త్వతోమతాః ॥

అతో ద్వాభ్యాం సముచ్చిత్య త్రిరావృత్య ప్రకల్పయేత్ ।
షట్సూత్రం తచ్ఛివం ప్రోక్తం రుద్రగ్రంథి సమాయుతం ॥
అప్రమత్తేన తద్ధార్యం శివసజ్జికయాసహ ।
యత్యదీక్షితబాలైస్తు ధారణం వసనేనవా ॥ ”

( అనగా రెండు పోగులను ముప్పురిగా చేసి ఆరు వరుసలుగా శివదారమును లింగపుకాయకు గ్రుచ్చి ఒక ముడిని మాత్రమే వేయ వలయును. లింగము గురు, లింగ, జంగమ మని మూడువిధములుగా నున్నది. అవి జ్ఞానకర్మలనెడి రెంటిచే గుణింపగా ఆరగుచున్నవి. అట్టి యారు షట్స్థలములచే గుణింపగా ముప్పది యారగును. దీని ననుసరించియే షట్త్రింశత్తత్త్వాత్మకుండని శివుడు సుప్రసిద్ధుడు. )

రాను రానాంధ్రదేశమందలి భక్తులలోనేమి మాహేశ్వరులలోనేమి పవిత్రమును అత్యంత ముఖ్యంబు ను నగు శివదీక్షా సంస్కారము లోపించుట మహాఘోరమనవలసి యున్నది. ఇట్టి విషయములందు శ్రీపట్టచరాధికారి స్వాములు మతమయ్యలు త్వరగా జోక్యమును కలిగించుకొని సదాచారముల నెలకొలుపుచు శివదీక్షల ప్రచార మొనర్తురు గాక ! దీక్షావిధియును గ్రంథముకూడ నాంధ్ర తాత్పర్య యుక్తముగ వ్రాయబడి యున్నది గనుక నెవ్వరైన నుదారపురుషులు యచ్చు వేయించుచో గొప్ప లోపమును నివారించి స్వధర్మసేవను గావించినవారగుదు రనుటలో సందియము లేదు. శ్రీ శ్రీ నందులమఠము ఆనందయ్య స్వాములవారు నీలింగ ధారణ విధిని యచ్చు

వేయించుటకు తదనుకూలముగ ధనసహాయ మొనర్చి నందు లకు వారికి నేనెన్నియో కృతజ్ఞతా వందనము లొనర్చి ఇతర చందాదారులకును నాకార్యమునకు దోడ్పదినందులకు నెంత యో కృతజ్ఞుడనైయున్నాడను.

ధర్మోద్ధార ధురీణులును విద్యానిధులును నగు బ్ర. శ్రీ. చి దిరెమఠము వీరభద్రశాస్త్రిగారు దీనిని పరిష్కరించుటయందును ముద్రాపించుటయందును గొప్పగా బరిశ్రమించినారు. ఇదివారి జీవితమందలి స్వకర్తవ్యమగుటజేసి నేను కృతజ్ఞతావందనము లర్పించ బనిలేదు కాని ఇట్టి మహనీయుల యాజమాన్యమున స్వసమాజము దన కర్తవ్యమును గుర్తెరంగుగాక యని నివేదిం చు చున్నాడ.

హైదారాబాద్ దక్కన్,
ధాతృ॥జ్యే॥బ॥ ౩.

ఇట్లు,
రా. మ. వీరభద్రయ్య.

ఓం



# ఉపోద్ఘాతము.

( లింగధారణసిద్ధాంతము, )



వేదకావ్యస్మృతితీర్థ, ధర్మాచార్య, విద్యానిధి, విద్యారత్నాది
బిరుదాంచితులును, ప్రస్తుతము యాదగిరి శంకర
సంస్కృత కాలేజ్ ప్రిన్సిపాలుగారునగు
బ్ర. శ్రీ. పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారు
వ్రాసినది.

---

శ్లో॥ వందే శ్రీరేణుకాచార్యం సద్గురుం తం జగద్గురుం ।
యోవీరశైవసిద్ధాన్త—స్థాపకేష్వపి చాదిమః ॥

---

పరమవైదికులును సనాతనధార్మికులునునగు భారతీయా ర్యులలోఁ ద్విమతములు సుప్రసిద్ధములై యనాదినుండి ప్రచారమునందియున్నవి. శైవులు వేదములను శ్రద్ధతోఁబ్రమాణించు

మున్నను శివోక్తములగు శివాగమములను ముఖ్యాదర్శముగాఁ గొని తమయాచారములను నిర్వహించుచున్నారు. త్రిమతికుల సిద్ధాంతములు వేదమూలములగుచోఁ బరస్పరవిరుద్ధాచారములేలఁ బ్రబలెననుప్రశ్నకు "వేదవ్యాకరణములగు నిరుక్తప్రాతిశాఖ్యాదుల ననుసరించి స్వశాస్త్రానుకూలముగ వేదమునకు నర్థమును నిష్పాదించి స్వమతములను ప్రస్థానత్రయపూర్వకముగ స్థాపించిరి" అనునుత్తరమును జ్ఞాపకముంచికొనవలయును. ఇటఁ బ్రస్తుతమగు శైవాచారమందలి లింగధారణవైదికత్వమునుగూర్చి వివరింపవలసియున్నది.

శివాగమములు పరశివుని పంచబ్రహ్మాత్మకములగు సద్యోజాతవామదేవాఘోరతత్పురుషేశానములనెడు పంచవక్త్రముల నుండి యుపదిష్టములైనవి. వీనియందే వివిధశైవసిద్ధాన్తములు విశదీకరింపబడినవి. సుప్రబోధాగమక్రియాపాదమందలి ప్రశ్నవిధిపటలమందుఁగల :—

శైవంపునశ్చతుర్భేదం వామందక్షిణమేవచ ।
మిశ్రంచైవ తు సిద్ధాన్తం తేషు సిద్ధాన్తముత్తమం ।
అష్టావింశతిభేదేన సిద్ధాన్తం శృణు తత్త్వతః ॥

అను శివోక్తిననుసరించి వామ, దక్షిణ, మిశ్ర, సిద్ధాన్తములనెడు చతుర్విధశైవమతములలో సిద్ధాన్తశైవమే యుత్కృష్టమైనది, ఈసిద్ధాన్తశైవమతాన్తర్గతమైనదియ వీరశైవము. కామికాద్యష్టావింశతిశివాగమములయొక్క యుత్తరభాగములలోఁబరమపవిత్రమగునీవీరశైవమతసిద్ధాన్తము ప్రతిపాదింపఁ

బడినది. ఇందుకుఁబ్రమాణము శ్రీజగద్గురు రేణుకాచార్యులచే నగస్త్యమహర్షికి నుపదేశింపఁబడిన వీరశైవసిద్ధాన్తము శివ యోగిశివాచార్యుఁడను ప్రాచీన (షుమారు ౧౫ వందలవత్సర ములక్రితముండిన) వీరశైవపండితునిచే సంగ్రహింపఁబడిన "సిద్ధాన్తశిఖామణి" యను మహోత్కృష్టగ్రంథముయొక్క పంచమపరిచ్ఛేదమునఁగలదు ఆదియిది:—

సిద్ధాన్తాఖ్యేమహాతంత్రే కామికాద్యేశివోదితే।
నిర్దిష్టముత్తరేభాగే వీరశైవమతం పరం ॥ ౧౪ ॥

శివపంచముఖోద్భూతులగు శ్రీజగద్గురురేణుకాదిపంచాచా ర్యులు గతయుగములలోవలె నీయుగమందును శ్రీసోమేశ్వరా ది పంచలింగగర్భావిర్భూతులై భూతలమున నీవీరశైవమతము ను స్థాపించిరి. ఇందు లింగాంగసామరస్య (శివజీవైక్య) మే పరమపురుషార్థము, అనగా మోక్షము. మోక్షాపేక్షగలవారికిఁ గానీమతము శివలింగధారణము, శివదీక్ష, శివపూజలఁనెడిత్రివి ధకర్మను ముఖ్యముగా బోధించుచున్నది. వీరశైవులలోగల వివిధవర్ణములవారును నీకర్మల నాచరించుటకు నధికారులే. అయితె వారివారితారతమ్యమునుబట్టి లింగములలోను దీక్షల లోనుపూజలలోను భేదముకలదు. లింగధారణమావశ్యకమని యు నిదియే మోక్షసాధకమనియు నిగమాగమపురాణేతిహాసాది సమస్తప్రబలప్రమాణములవలన స్థిరపడుచున్నది. పారమేశ్వ రాదిశివాగములలో లింగధారణముసవిస్తరముగఁబ్రతిపాదింపఁ బడియుండుటచే వానిని బ్రత్యక్షముగఁదెలిసికొనుటయెకల్యాణ మగును. ప్రథమ ప్రమాణముగనిట ఋగ్వేద మంత్రమునుచా

హరించుచున్నాను.

పవిత్రం తే వితతం బ్రహ్మణస్పతే ప్రభుర్గాత్రాణి ప ర్యేషి విశ్వతః। అతప్తతనూర్నతదామో అశ్నుతే శృతాస ఇద్వహన్త స్తత్సమాశత ॥

(అష్ట. ౭. అధ్యా. ౩. వర్గ. ౮.)

ఈమంత్రము లింగధారణము నాజ్ఞాపించుచున్నది. దీని యర్థమిది,— బ్రహ్మణస్పతే-లింగరూపశరీరావచ్ఛేదములోఁడను శరీరిభావముతోఁడను నధిష్ఠాతృవగునోపరశివుడా! తే-నీ యొక్క, తత్-బ్రహ్మపదవాచ్యమగు లింగరూపశరీరము, పవిత్రం-ఉక్తరీత్యాశుచ్యశుచికాలములందును ధరించయోగ్యమైనది వితతం-ఇష్టప్రాణభావములనెడు త్రివిధభేదముచేతను ఆచారలింగాదిభేదషట్కముచేతను బహువిధముగఁబ్రఖ్యాతమైనది.

ప్రభుః-నిగ్రహానుగ్రహసమర్థుఁడవై లింగరూపమున వ్యాపకుఁడవగునీవు, విశ్వతః-సమస్త (ఇష్టప్రాణభావ) ములగు, గాత్రాణి-స్థూలసూక్ష్మకారణరూప భక్తశరీరములను, పర్యేషి-వ్యాపించుచున్నావు, అనఁగా ధరించఁబడినవాఁడవై లింగరూపకశరీరముచే భక్తాంగసంగివైతివని తాత్పర్యము.

అతప్తతనూః-వేధా, మను, క్రియ, లనెడు శివదీక్షాత్రయసంస్కారముచేత దగ్ధపాపుఁడుగానట్టి, ఆమః-అపరిపక్వాంతఃకరణుఁడగుఁబురుషుఁడు, తత్-అపరశివస్వరూపమగునిష్టలింగమును, నాశ్నుతే-పొందఁజాలఁడు, ఇద్వహంతః-శివజ్ఞానసంపన్నులగు, శృతాసః-శివలింగాశ్రితులు, తత్-ఆశివలింగబ్రహ్మము యొక్క సామరస్యమును, సమాశత-సర్వత్ర పొందుచున్నారు,

అనఁగా లింగధారణశివదీక్షా శివపూజలద్వారా శివజీవైక్య (మోక్ష) ము లభించునని యాదివేదము పరమహితముననుఘోషించుచున్నది.

బ్రహ్మశబ్దమునకు లింగార్థ మెటులని కొందఱడుగవచ్చును " బ్రహ్మేతిలింగమాఖ్యాతం " అను లింగపురాణమందలి వ్యాస వచనమును " తల్లింగంబ్రహ్మబ్రహ్మశాశ్వతం " అను సిద్ధాన్త శిఖామణివచనమును, శ్రీశంకరాచార్యుల యపరాధ క్షమాపణ స్తోత్రమందలి " లింగజ్ఞైర్బ్రహ్మవాక్యైః " అను వచనము ను మొదలైన నసంఖ్యాతప్రమాణములచేతను "లీనమర్థంగమ యతీతిలింగం " అను ననుకూలవ్యుత్పత్తిచేతను బ్రహ్మశబ్దము నకు లింగార్థము సిద్ధాన్తమగుచున్నది.

" పవిత్రంతే " యను మంత్రము సోమయాగమందలి ద శాపవిత్రీకరణమున వినియుక్తమగుటఁజేసి లింగధారణపరము గ నర్థముఁజేయుచో " దేవతాభేదప్రకరణవిరోధము " మున్న గు దోషములు సంభవించుచున్నవని కొందఱందురు గాని యది యు నిస్సారమే ! ఏమంత్రము ఎచట వినియోగింపఁబడినదో ఆమంత్రము నచ్చోటనేతప్ప మరొకచోట వినియోగింపగూడదని నియమమేమియులేదు. ఏలనన, చయనయాగప్రకరణమున వినియుక్తమగు రుద్రాధ్యాయము శివలింగాభిషేకమున శ్రౌత స్మార్తపండితులచే వినియోగింపఁబడుట శాస్త్రసిద్ధమేకద !

ప్రకరణమనెఁడు ప్రమాణమునకంటె " పవిత్రంతే " అను మంత్రోచ్చారణానంతరము మాయభిమతార్థము స్పష్టమగుచు న్నది కావున ప్రకరణాపేక్షలేకయే లింగమనెఁడు ప్రబలప్రమాణ

మువలన విరోధులయాక్షేపము నిలువజాలదు. అనఁగా మీ మాంసాశాస్త్రమున వేదవాక్యవినియోగపద్ధతిలో "శ్రుతి, లింగ, వాక్య, ప్రకరణ, స్థాన, సమాఖ్య," లనెఁడు నారు ప్రమాణములు కలవు. ఇవి నొకదానికంటెనొకటి పూర్వపూర్వముగఁ బ్రబలములు. ఇచ్చోటను విరోధులు వచించు "ప్రకరణ" స్వీకారము సమంజసముకానేరదు. లింగప్రమాణమే ప్రబలము. ప్రకరణబాధ దుర్బలమైనది కావున లింగపదార్థము సిద్ధాన్తమే యగుచున్నది. మఱియు:—

సోమఃపవ తే జనితా మతీనాం జనితా దివో జనితా పృథివ్యా జనితాగ్నేర్జనితేంద్రస్య జనితా౽థవిష్ణోః ॥

(ఋ. ౭. ౪. ౬.)

అను మంత్రము యాజ్ఞికుల మతానుసారము "సోమము స్వర్గాది సమస్త లోకములను విష్ణ్వాది సమస్త దేవతలను సృజించె" నను యభిప్రాయమును బోధించుచున్నదికదా! ఈ సందర్భమున వారు "సోమ" శబ్దమునకు లత (ఒకవిధమగు తీగ) యను నర్థమును బలత్కారముగఁజేయుచున్నను జడమగు సోమలతకు జగత్సృష్టిజేయు శక్తిలేదుకావున నాయర్థము పరిహాసాస్పదమే! వీరశైవులీసోమశబ్దమునకు "ఉమయా సహితఃసోమః" అను విగ్రహమువలన శివార్థమును ప్రతిపాదించి శివునకు సృష్టిశక్తికలదను సమంజసబోధను చేయుచున్నపుడు "సోమఃపవతే" మంత్రము సోమలతాస్తోత్రమనుటయు "పవిత్రంతే" మంత్రము సోమయాగదశాపవిత్రీకర

ణప్రయుక్తమనుటయును “ గజమిథ్య, పలాయనముమిథ్య ” యను సామెతకు సరిపోవుచున్నది.

ఇఁక దేవతాభేదమను నాక్షేపమును గగనకుసుమమే ! ఏలనన “ కదాచనస్తరీరసి నేంద్రసశ్చాసిదాశుషే ” అను మంత్రము అభిధాశక్తిలింగప్రమాణముచే నింద్రదేవతోపస్థానమును బ్రత్యక్షముగబోధించుచున్నను యాజ్ఞికులు “ అగ్న్యుపస్థాపనమున ” నుపయోగించుచున్నారు. అనఁగా ఇంద్రదేవతాకమంత్రముతో అగ్నిదేవతాస్థాపన పూజలనొనర్చుచున్నారు. ఈప్రకారముగఁబ్రతిపక్షులవాదముదుర్బలప్రమాణాశ్రితమగుటఁజేసి యనంగీకార్యముకదా ! కావునఁబ్రత్యక్షశ్రుతులగు శివాగమములు శ్రీమద్రేణుకాద్యాచార్యప్రోక్తములగు బ్రహ్మసూత్రభాష్యాదికములును వ్యాసోక్తలింగపురాణాద్యుపబృంహణవాక్యములును అనాదిప్రసిద్ధములగు శిష్టాచారములును బోధించుచున్న లింగధారణ సిద్ధాన్తము శుద్ధవైదికమనుటయే శ్రేయస్కరము.

లింగధారణవైదికత్వమునుగూర్చి విశేషచర్చనపేక్షించు పండితులు శ్రీనందికేశ్వరశివాచార్యుల సుప్రసిద్ధమగు “ లింగధారణ చంద్రిక ” నవలోకించ గోరుచున్నాను. “ అభినవపాణిని ” “వ్యాకరణాచార్య” “మహామహోపాధ్యాయా” ది బిరుదాంచితులు శివలోకస్థులు పండిత శ్రీశివకుమారశాస్త్రులవారు, స్మార్తమతస్థులైనను నీలింగధారణచంద్రికయొక్క పవిత్రతను ప్రౌఢిమను గన్గొని దీనికినుపయుక్తముగ నొకసంస్కృతవ్యాఖ్యను విరచించి కాశీక్షేత్రమున ముప్పదియేండ్లకుఁబూర్వము శ్రీవిశ్వారాధ్య సింహాసనాధీశ్వర శ్రీజగద్గురు రాజేశ్వరశివాచార్యమహాస్వా

ములవారి మహదాశ్రయముచేత బ్రకటింపఁజేసి పండితమండ లి నానందపరచిరి. ఇటులే వేదోక్తములగు "ఊర్ధ్వాయనమః" "అయం మేహస్తో భగవాన్" "సర్వాననశిరోగ్రీవః" మున్న గు ననేకమంత్రములలోఁ బ్రతిపాదితమగు లింగధారణసిద్ధాన్త ము. శ్రుతిసారభాష్య శ్రీకరభాష్యాది గ్రంథములందు విస్తృత ముగఁగాననగును.

---

ఇతర సంప్రదాయాచార్యులును నుపరోక్తమంత్రములకు స్వస్వమతపరముగఁబరస్పరభిన్నార్థముల స్వీకరించియేయున్నా రు. ఆదికాలమనుండియు వీరశైవాచార్యులు ప్రబలప్రమాణా శ్రితులై లింగధారణపరార్థములనంగీకరించి నిస్సందేహముగఁ దదాచరణపరాయణులగుటకు మోక్షాపేక్షయే కారణమనవలసి యున్నది.

---

"పవిత్రంతే" అను మంత్రమునకు సాక్షాత్తుగ శ్రీవ్యాసు లవారు లింగధారణపరార్థమును లింగపురాణమునందు నుప బృంహణించియున్నారు. ఇపుడు ముద్రితములగు లింగపురా ణాదిగ్రంథములకుఁబరమతద్వేషాసూయాపరులగువారు సంపా దకులగుచున్నారు కావున లింగధారణాది వీరశైవసిద్ధాన్తపరము లగు ననేక శ్లోకములను దీసివేయుచున్నారు. ప్రాచీనలిఖితప్ర తులలోనాప్రమాణములుండియేయున్నవి. అయినను, అష్టాదశ పురాణోద్ధారక బిరుదాంచితులు కాంచీపుర నివాసులు నగు కీ॥ శే॥ పువ్వాడ వెంకటరావుగారిచే శ్రీ॥ శ॥ ౧౮౭౯వ వత్సర మునఁబ్రకటితమైన లింగపురాణోత్తరభాగమందలి ౨౧వ యధ్యా

యముననగల నీక్రిందిశ్లోకములు పై మంత్రార్థమును స్పష్టము గఁజెప్పుచున్నవి :—

బ్రహ్మేతి లింగమాఖ్యాతం బ్రహ్మణస్పతిరీశ్వరః ॥౯౮॥
పవిత్రం తద్ధి విఖ్యాతం తత్సంపర్కాత్తనుశ్శుచిః ।
ఋగిత్యాహ పవిత్రం తే వితతం బ్రహ్మణస్పతే ॥౯౯॥
తస్మాత్పవిత్ర తల్లింగం ధార్యం శైవమనామయం ।
అతప్తతనురజ్ఞో వై హ్యంగీ సంసారలక్షణః ॥౧౦౦॥
దీక్షయా రహితస్సాక్షా న్నాప్నుయాల్లింగముత్తమం ।
యః కరోతి తపః పూర్వం స తప్తతనురుచ్యతే ॥౧౦౧॥
పరిపక్వో విమోక్షాయ సోఽశ్నుతే లింగధారణం ।
నకరోతి తపః పూర్వం సోఽతప్తతనురుచ్యతే ॥౧౦౨॥

ఈశ్లోకములయర్థమునకును "పవిత్రంతే" మంత్రమునకు వెనుకవ్రాసినయర్థమునకును భేదములేమి మరలఁదాత్పర్యమునువ్రాయనవసరములేదు. నూటయెనిమిదిశ్లోకములవరకు నింకను వైయధ్యాయమున లింగధారణమే ప్రతిపాదితము. ఇటులె ప్రాచీనగౌతమస్మృతిలోని :—

ముఖే మంత్రో హృది ధ్యానం మస్తకే లింగధారణం ।
శిఖారుద్రాక్షభస్మాని చేతి బ్రాహ్మణలక్షణం ।

అనుప్రమాణము వీరశైవబ్రాహ్మణపరమని వీరశైవవాఙ్మయమునఁబలుచోటుల స్పష్టీకరింపఁబడినది. యజుర్వేదమునకు

౧౯౯ శాఖ (ఉపనిషత్తు) లని విద్వల్లోకమునకుఁబరిచయమే !
ఏతచ్ఛాఖేయవీరశైలింగ్యోపనిషత్తునందును :—

"ఆత్మలింగం మోధస్తే సోఽహమేవ। తదధీహి ద్వివిధం లింగం ఇష్టంప్రాణంచ। యదక్షరం పరంబ్రహ్మ తత్సూత్రమితిధారయేత్। చతుర్వర్ణానాం లింగమ్మనుతే"

అను సూక్తమును బుధులు తిలకింతురుగాక! ఈయుపనిషత్తుయొక్క ప్రాచీనప్రతియొకటి మద్రాసు ఒరియంటల్ లైబ్రరిలో సురక్షితముగనుండుట వీరశైవుల భాగ్యమనవలసియున్నది. అచ్చోటనేకల లింగధారణోపనిషత్తునందును,

"పిండాజ్జననం తజ్జన్మకాలే లింగధారణముచ్యతే
అయం మేహస్తో భగవానితి ధారయేత్"

అని లింగధారణమునుగూర్చి విపులమైనచర్చ కలదు. మైసూరు గవర్నమెంటువారి లైబ్రరిలోగల సిద్ధాన్తశిఖోపనిషత్తునందును,

"గచ్ఛంస్తిష్ఠన్ నిమిషన్నున్మిషన్వా స్వపన్ జాగ్రన్ లింగధారీ శుచిఃస్యాత్। శీర్షే కంఠే వక్షసి కక్షదేశే సర్వదా ప్రాణలింగం ధార్యం। యథాసంప్రదాయం పురస్తాద్గురోర్వి విత్వాహృదయం ముఖ్యముక్తం"

ఇంక నీవిధముగ మైసూరునందుగల "వేదాంతసారప్రసాద జాబాలభక్తియోగ చిదంబరనిర్లేపాద్య" నంతోపనిషత్తులలో శివలింగధారణము మోక్షదాయకమని స్పష్టముగ ప్రతిపాదింపఁబడినది. మఱియు శివముఖోద్గతములగు శివాగమ

ములు ప్రత్యక్షశ్రుతులేకావున ( శివాగమప్రామాణ్యముఁగూర్చి "శివాగమపరిచయమను" మరొకవ్యాసమున వివరింతును ) వానినాశ్రయించి వీరశైవులులింగధారులైపురుషుని పరమార్థమగు మోక్షమును సులభముగ సంపాదింపఁగలుగుచున్నారు. లింగధారణ ప్రతిపాదకములగు శివాగమప్రమాణము లొకటి రెండుదాహరణార్థమైయిటఁబ్రస్తుతింపఁబడుచున్నవి :—

"యస్య భస్మ లలాటేఽస్తి కంఠే లింగమ్మదాత్మకం ।
రుద్రాక్షధారణం దేహే సోఽహం దేవి న సంశయః ॥౨౮॥
( పారమేశ్వరాగమం. ప. ౧. )

తల్లింగం స్థాపయేచ్ఛిష్యే సమ్యగ్ధ్యాత్వైకభావతః ।
ధ్యాత్రే శిష్యాయతల్లింగం ధారయిత్వానిరూపయేత్ ॥౪౭॥
( సూక్ష్మా. ప. ౫. )

కంఠేమూర్ధ్న్యథవా కక్షే ధారయేచ్ఛివలింగకం ॥౩౨॥
( వాతూలా. ప. ౧౦. )

ప్రాణవద్ధారణీయం తత్ప్రాణలింగమిదంతవ ।
కదాచిత్కుత్రచిద్వాపి నవియోజయ దేహతః ॥౫॥"
( సిద్ధాంత శిఖామణి ప. ౬. )

కావుననే శ్రీజగద్గురు రేణుకాచార్యులు వేదాగమపురాణేతిహాస ప్రసిద్ధమగు లింగధారణతత్త్వమును నగస్త్యమునీశ్వరునకు నుపదేశించిరి. ఇంక నీవిషయమును విశదముగఁజూడగోరువారు శివపూజాశివలింగస్వామికృతమగు శ్రుతిసారభాష్యము నధ్యయనమొనర్తురుగాక !

మఱికొందరు బాలకులు "లింగధారణము" భారతవర్షే తిహాసమున నగపడదని ప్రశ్నించుచున్నారు. వేదాగమములు ఘంటాఘోషగవివరించుచున్ననను నమ్మకఁ గంపినీదొరలవలన నేర్చికొనిన కృతకమగు నొకవిచిత్రపద్ధతితో విపరీతవిమర్శనల గావించి యితిహాసమనివాకొనుచున్నారు. అట్టివారికి "వీరశై వ మతచరిత్ర" యందుఁబ్రత్యేకముగ నుత్తరించవలసియున్నను నిటసంక్షేపముగసూచించెదను :—

Mir. B. Lewis Rice, C. I. E., M. R. A. S., దొరగారి "Mysore Inscriptions" అను గ్రంథమందలి శికారిపురతాలూకా బెళ్ళిగావి శిలాశాసనముల విషయమును ౨౧౦ వ పుటలోని గాంగవంశీయ వీరప్పరాజుగారి చరిత్రను, Mir Pleat దొరగారి "Dynasties of Canrese Districts" గ్రంథము ౪౫ వ పుటలోని విమర్శనను Mir Filip Brown దొరగారి "Karnatic Chronolagy" పుస్తకము ౪౧ వ పుటలోని వ్యాసమును అవలోకించువారికి క్రీస్తుశకము ౩వ శతాబ్దము అనఁగా నేటికి పదునేడువందల సంవత్సరములకుఁబూర్వమే లింగధారులగు వీరశైవులున్నటులు స్థిరపడగలదు :—

"విష్ణుబ్రహ్మాదయో దేవా మునయో గౌతమాదయః ।
ధారయంతి సదాలింగ ముత్తమాంగే విశేషతః ॥౬-౩౫॥

అను సిద్ధాన్తశిఖామణి ప్రమాణముచే విష్ణ్వాదిదేవతలును గౌతమాదిమహర్షులును శివలింగధారణ పూజల నొనర్చి

ధన్యులైరనుట స్పష్టపడుచో నాశ్చర్యమేమియులేదు. విష్ణువు వివిధావతారములలో రామేశ్వర, కూర్మేశ్వర, వరాహేశ్వర మొదలగు లింగములను మహర్షులు గౌతమేశ్వర, అగస్త్యేశ్వర, వశిష్ఠేశ్వర మొదలగు లింగములను స్థాపించిన విషయము సుప్రసిద్ధమేకద!

కాశీవిశాలాక్షిమస్తకమందును పంఢరిపురమందలి పాండురంగవిఠలుని మస్తకముననను తిరువాంకూరురాజ్యపు అనంతశయనపట్టణమందలి అనంతపద్మనాభుని హస్త పీఠమందును తుళజాపురీ భవానియొక్క శీర్షమునందును బార్శి ( Dt. Sholapur ) భగవంతుని శిరస్సునందును శివలింగమును ప్రత్యక్షముగఁగాంచనగును. ఈ విగ్రహములన్నియు నత్యంత ప్రాచీనములనుటకు సందియములేదు.

ఇఁకనాంధ్రదేశమున సుప్రసిద్ధుఁడగు తిరుపతి వెంకటేశ్వరుని విగ్రహమ్మునైతము ప్రాచీనకాలమున వీరభద్రవిగ్రహమనియుహస్తభాగమున లింగముకలదనియు సర్పభూషణములు కలవనియు వైష్ణవులాక్రమించి వేంకటేశ్వరునిగామార్చిరనియుఁ బ్రత్యక్షానుభవముగల పెద్దలు వచించుచున్నారు. కాఁగా శ్రీరామానుజాచార్యులే యీవిగ్రహమునుమార్చిరని సుప్రసిద్ధుఁడగు శ్రీపతిపండితుఁడు తన శ్రీకరభాష్యమున నిట్లు వ్రాసెను.

" వెంకటేశ్వరస్య ఆభాసవిష్ణుత్వం । తదంగేనాగభూషణాది ధర్మాణాంద్యోతనాత్ మూలవిగ్రహేశంఖచక్రాదిలాంఛనానామదర్శనాత్ వీరేశ్వరస్య రామా_____

నుజకల్పితవేంకటేశ్వరత్వం రజ్జుసర్పవదాభాసమాత్ర మేవ। కించతత్పాణ్యాఘాదేశే శివలింగదర్శనాదీశ్వర శబ్దో వ్యవహ్రియతే ॥ ”

శ్రీమదాది శంకరాచార్య శిష్యుఁడగు ఆనందగిరిచే విరచిత శంకరదిగ్విజయ గ్రంథమందలి చతుర్థప్రకరణమున లింగధారులగు జంగములు శంకరాచార్యులతో వివదించినటులు స్పష్టముగఁదెలువఁబడియున్నది. ఏతత్సమయముననే కాబోలు శ్రీరేణుకశివాచార్యులు శ్రీశంకరాచార్యులకు “ శ్రీచంద్రమౌళీశ్వర లింగము ” ననుగ్రహించిరి ఈవిషయమును రేణుకవిజయ గురువంశకావ్య శివతత్త్వరత్నాకరాది గ్రంథములు ఘోషించుచున్నవి. ( “ శ్రీజగద్గురు రేణుకాచార్యుల ” ను నావ్యాసమున దీనిని వివరింపనున్నాను ) శ్రీశంకరాచార్యుల శృంగేరిమఠమున నిప్పటికిని శ్రీచంద్రమౌళీశ్వర లింగపూజ జరుగుచుండుట సర్వజనవిదితము.

ఇవ్విధముగ వేదాగమోపనిషత్పురాణేతి హాసప్రసిద్ధమగు లింగధారణము మోక్షసాధనమనుట సమంజసమెకద! కాన సిద్ధాంత శిఖామణి యందలి

“ వేదశాస్త్రపురాణేషు కామికాద్యాగమేషుచ ।
లింగధారణమాఖ్యాతం వీరశైవస్య నిశ్చయాత్ ॥

౬-౩౬ ॥ ”

ఈ వచనము శివశాసనమనుట నిశ్చయమే! పరశివుఁడగు శ్రీమన్మహాదేవుఁడు జగత్కల్యాణార్థమై లింగరూపమున భువనబ్రహ్మాండముల నాక్రమించియున్నను మానవులు తెలియకున్నారు. ఈ చరాచరాత్మక జగత్తుయొక్క చావు పుట్టకలు శివలింగమునుండియె కలగుచున్నవి. లింగాంగులు శివదీక్షితులై షట్స్థలాష్టావరణపంచాచార పరాయణులై శివజీవైక్యశాస్త్రమగు లింగాంగసామరస్య (వీరశైవుల శివాద్వైతలేక శక్తివిశిష్టాద్వైత) జ్ఞానమునార్జించి లింగైక్యము (సాయుజ్యముక్తి) నందుదురుగాక! లింగతత్త్వమును గూర్చి ప్రత్యేక గ్రంథమున విస్తరింపవలసియున్నది. ఈ యల్పగ్రంథమునకు నిప్పటికే పీఠిక పెరిగిపోవుటవలన నింతటితో సంక్షేపించుచున్నాను.

పరమపావనోదారచరిత్రులును వీరశైవమతానుపమాభిమానఘనులును విద్యార్థికుల ప్రోత్సాహకులును వైదికశిఖామణులును శివలోకగతులుననగు శ్రీమహంతుమఠము చెన్నబసవయ్యబావగారి స్మారకార్థముగ నీపొత్తమును మదాత్మీయ బాల్యమిత్రులగు శ్రీ॥రా॥మ॥ వీరభద్రయ్యగారు ప్రకటించి కొంత ఋణమును దీర్చికొనుటఁ బుణ్యావిశేషమనవలసియున్నది. శ్రీచెన్నబసవయ్య బావగారు వాస్తవముగ నన్ను సుతనిర్విశేషముగఁగరుణించి పదమూడు వత్సరముల నుండియు యథాశక్తి సర్వతోముఖముల మదియసంస్కృత విద్యాధ్యయనమును బ్రోత్సహించిరి. ఇట్టి మహానుభావుఁడకస్మాత్తుగ లింగైక్యము నందుటయు నేనుదూరదేశమునందుండుటయు మహాదుర్విధానములు ఆపుణ్యశరీరుని సందర్శనమిఁక నావంటి దుర్భాగ్యునకు లభించఁజాలదు

కదా! వారి నామస్మరణమె నా యగ్రిమస్వమత సేవాకార్యమున కు రక్షయై వెలుఁగుగాక! శివస్వరూపులగు శ్రీబావగారికి నీ చిన్ని వ్యాసమును "పత్రం పుష్పం ఫలంతోయం" అను నార్యోక్తి ననుసరించి యుడుతభక్తితో సమర్పించుచున్నాను.

లీయతే గమ్యతే యత్ర జగదేతచ్చరాచరం।
తమ్మహాలింగమాత్మానం ప్రణమామి సదాశివం॥

కాశీక్షేత్రము
శ్రీముఖ॥ఆశ్వీ॥బ॥౫.

ఇట్లు,
చి. మ. వీరభద్రశర్మ.

(ఈ వ్యాసము కాశిలోనుండగా వ్రాయబడెను.)



# "శిశ్న దేవ" — శబ్దార్థము.

ఏకార్యమునం దైనను ఇతరులనుండి బాధలు వాటిల్లగూడ దను తలంపుతో రాజు మున్నగు నధికారులును వేదికొని లౌకికులు కట్టుదిట్టములను గావించుకొనునటులే యజ్ఞ యాగ వివాహాదులయందును దుష్టులగు రాక్షసులవలన గలుగు విఘ్నములును నివారించుకొనుటకై వైదికులు సురపతియును దండనసమర్థుండునునగు ఇంద్రునిగూర్చి యనేకసూక్తములతో వేదమున బ్రార్థించియున్నారు. ఇట్టిప్రార్థనలతో ఋగ్వేదము నిండియున్నది. నొకచోట "శిశ్నదేవ" శబ్దము వచ్చియుండుటయు దానిగూర్చిన చర్చబయలుదేరియుండుటజేసియు నీవ్యాసము వ్రాయవలసివచ్చినది. ఆ మంత్రమిదుగో :—

"న యాతవ ఇంద్ర జూజువుర్నో న వందనా శవిష్ఠ వేద్యాభిః । స శర్ధదర్యో విషుణస్య జంతోర్మా "శిశ్న దేవా" అపి గుర్ఋతం నః ॥"

(ఋగ్వేద ౫. వ అష్ట. ౩. ౩)

ఇందుగల "శిశ్నదేవ" శబ్దమునకు గ్రమమెరుగని పాశ్చాత్యులు కొందరును, అంధవిశ్వాసముతో వారివాక్యము నే నమ్ముచున్న మనదేశపువారు కొందరును "శిశ్న" మనగా "శివలింగ" మనియును "శిశ్నదేవు" లనగా శివలింగమును బూజించుచున్న ద్రావిడులనియు విపరీతార్థముజేయుచు శైవులారాధించు లింగమూర్తి యాశ్వరచిహ్నముగాదనియు గోలబెట్టుచున్నారు. ఇదిసరికాదు, దీనికి సరియైన భావము నీక్రిందవ్రాయుచున్నాడ :—

" ఓయింద్రుడా ! రాక్షసులు మమ్ము బీడింపకుందురుగాక ! మహాబలశాలివగునోయింద్రుడా ! రక్కసులుమమ్ము ప్రజలనుండి యెడబాపకుందురుగాక ! ప్రభువగునాయింద్రుడు విషమప్రాణులను శాసించుటయందు సమర్థుడగుగాక ! శిశ్న దేవులు అనగా బ్రహ్మచర్యహీనులగు కాముకులు మాసత్కార్యమునకు విఘ్నముకలిగించకుందురుగాక !! "

యథార్థమిటులుండగా వేదార్థములను జేయునపుడు పరంపరా సంప్రదాయములను తృణీకరించి యిచ్చవచ్చినటుల వాక్రుచ్చుట సత్యముగానేరదు. తమయర్థమునకు ప్రకరణము ననుసరించి సరియైనకారణములుండి తీరవలయును. సహజముగా నగపడు నర్థముకంటె నొకప్పుడు గౌణముగ లక్షణార్థములను గూడజేయకతప్పదు.

" శిశ్నదేవ " యనుశబ్దమునకు " వ్యభిచారి " " అబ్రహ్మచారి " " కాముకుడు " అను నర్థములే ఇచ్చటి ప్రకరణము ననుసరించి సమంజసముగ నున్నవి. చతుర్వేదపారంగతుడు సాయణాచార్యుడు తన భాష్యమందు

" శిశ్నేన దీవ్యంతి క్రీడంత ఇతి శిశ్నదేవాః, అబ్రహ్మచర్యా ఇత్యర్థః "

అని ఘంటాఘోషగ నుడివియున్నాడు. వేలసంవత్సరములు బ్రాచీనుడగు దుర్గాచార్యుడు నిరక్తమునకు భాష్యమును రచించినాడుకదా ! అతడును నీశబ్దమునకు

...

"శిశ్నేన నిత్యమేవ ప్రకీర్ణాభిః స్త్రీభిఃసాకం క్రీడంత ఆసతే"

(నిరుక్తనైగమ. ४. అ. ४౫.)

"స్త్రీలోలుడు" "వ్యభిచారి" అను నర్థమునే స్థిరపరచి యున్నాడు. మనదేశమందు "శిశ్నోదరపరాయణుడు" అను శబ్దమునైతము వ్యసని పురుషులంగూర్చి వాడుకలోనున్నది. నేటి దయానంద సరస్వతి కూడ నిట్టి విపరీతార్థము జేయలేదు.

"శిశ్నదేవ" అనునపుడు "శిశ్నమువలె ఆకారముగల శిలావిగ్రహమును బూజించువాడు" అను నర్థమును గ్రహించుచో "పితృదేవుడు" అను నపుడును "తండ్రివంటి యాకారముగల శిలావిగ్రహమును బూజించువాడు" అనునర్థమునేగ్రహింపవలసి వచ్చును గదా! ఇట్టి విపరీతార్థమును విమూఢాత్ములు దప్ప మఱెవ్వరును నమ్మజాలరు. తలిదండ్రులు బ్రతికి యున్నంతకాలము మందలించక, చనిపోయినతదుపరి వారి యాకారముగల విగ్రహములను బూజించుమని వేదములెన్నటికిని జెప్పవు. కావున "శిశ్నదేవ" యనగా "శిశ్నానందమే పరమ సుఖమనినమ్మినట్టి" అను నర్థమే సహజమైనది. అందుకనియే నీ మంత్రమందు "ఓయింద్రుడా! మా దారపుత్రాదులను కాముకులగు రాక్షసులు హరించి వ్రజలనుండి యెడబాపి మము వనవాసము పాలుగావించగలరు గాన రక్షించుమని" సాభిప్రాయముగా యాజ్ఞికులు ప్రార్థించుచున్నారు.

...... బ్రహ్మాండ పురాణమందు (ఉత్త. ౧-౯)

" ప్రాప్తే కలియుగే ఘోరే నరాః పుణ్యవివర్జితాః ।
పరాపవాదనిరతాః పరద్రవ్యాభిలాషిణః ॥
పరస్త్రీసక్తమనసః పరహింసాపరాయణాః ।
మాతృపితృకృతద్వేషాః స్త్రీదేవాఃకామకింకరాః ॥ "

" స్త్రీదేవ " యను శబ్దము వచ్చినది దీనికి " స్త్రీయాకారము గలిగినటువంటి శిలా విగ్రహము నారాధించువారు " అను నర్థము జేయవచ్చునా? ఇచ్చోట " కలియుగమందలి మానవులు దురాచారులనియు స్త్రీదేవులై అనగా నెల్లప్పుడు స్త్రీపరాయణులై వారి యాజ్ఞలమెలంగి పరదైవమని భ్రమించి శుశ్రూష జేయువారు " అను నర్థము ప్రకరణ సమ్మతమనియును సమంజసమనియును సంస్కృత భాష నభ్యసించుచున్న బాలకుడు నైతము నిరాంతకముగ జెప్పగలడు ఇట్లే ఋగ్వేదమందలి శిశ్నదేవ శబ్దమునకు శిశ్న పరాయణార్థము సిద్ధాంతిత మగుచున్నది.

పాశ్చాత్యులు ఇట్టి విపరీతార్థముల దీయుటకు గారణమేమనగా " భారతదేశమందలి నాగరికత ( Culture ) గాని ఆచార విచారములుగాని పవిత్రములుగావు అసలీదేశమార్య దేశము గాదు ఆర్యులమాతృదేశము ఏమధ్య ఏషియాలోనోకలదు మేము విదేశమునుండి వచ్చినటులే ఆర్యులును ఇచట వచ్చిచేరిరి ఇచట మొదలు ననాగరికులగు ద్రవిడులు వసించుచుండిరి వారు వైదికులు గారు శివుడు, రుద్రుడు, లింగము ఇవన్నియు ద్రవిడ దేవతలే! ఆర్యులలో విగ్రహారాధన లేకుండెను వేదములోనికి

ద్రవిడ శబ్దములు వ్రాకినవి " మున్నగు మిథ్యావార్తలను ప్ర చారించుటయు మనకు బూజ్యములగు దేవతలు దేశము ధర్మము భాష భావముల విషయమై అపూజ్యబుద్ధిని బుట్టించుచున్నారు. అమాయికులు కొందరు మన విజ్ఞాన భండారముల నంబడు వేదాగమాది ధర్మశాస్త్రముల జదువలేక విదేశీయుల వ్రాతలనమ్మి మోసపోవుచున్నారు. స్వరాజ్యతత్త్వమును కొంతవరకు దెలసికొన్న భారతీయులు ఇకనైన స్వధర్మాచార భావములను స్వాయత్తము జేసికొందురుగాక!

లింగము సంపూర్ణముగా శివస్వరూపమయ్యేయే యున్నది ఇది శివునియొక్క ఏయవ యవమునకును చిహ్నముగాదు. శివునియొక్క శిశ్నము తెగి పడినట్లును, తర్వాత దానిపూజ ప్రచారమైనట్లును (శాంతంపావం) కొంద అందరుగాని అది సరిగాదు. ప్రచ్ఛన్న బౌద్ధులో మ్లేచ్ఛులో ఇట్టి విపరీత వాదము నిటీవల జేర్చియుందురు.

బ్రహ్మ విష్ణువుల గర్వ పరిహారార్థమై శివుడు మహా లింగాకృతి (స్తంభాకృతి) తో భువన బ్రహ్మాండముల వ్యాపించగా నాద్యంతముల దెలియక విరించి కేశవులు బ్రార్థించుకొనిరి. అపుడు నిత్యపూజకు ననుకూలమగునట్లుగా సూక్ష్ముడై అంగుష్ఠాకృతితో శివుడు ప్రసన్నుండయ్యె నాటినుండి స్థావరలింగము లించుమించు స్తంభాకృతితోను ఇష్టలింగములు (హస్తపీఠము లందు) అంగుష్ఠాకృతితోను పూజింప బడుచున్నవి. పరమాత్ముండగు శివుని యంగుష్ఠాకృతినిగూర్చి

